# అంకితం

ప్రముఖభారత జాతీయ నాయకులు, అఖిలభారత కాంగ్రెస్ సోషలిష్టు పార్టీ ప్రధాన నాయకులు అయిన

బాబూ జైప్రకాశ్ నారాయణ్

అచ్యుత్ పట్వర్ధన్

డాక్టర్ రామ్మనోహర్ లోహియా

ఆచార్య నరేంద్రదేవ్

యూసఫ్ మెహరాలీ

పురుషోత్తం త్రికందాస్

అశోక్ మెహతా

యస్. యం. జోషీ

రామానంద మిశ్రా

అరుణా అసఫ్ ఆలీ

కమలాదేవి ఛటోపాధ్యాయ

లకు

శ్రీయుతులు బలుసు రామకృష్ణరావుగారు రచించిన "పాకిస్థాన్-మార్క్సిజము" అను పొత్తమును సాకల్యముగ చూచితిని. దీనిలో మతమునకు మార్క్సిజముతో నున్న వ్యతిరేకత, పాకిస్థాన్ నినాదమునకు మార్క్సిజమునకు గల వ్యత్యాసము, తత్త్వంలోని తారతమ్యము పాకిస్థాన్ లేకపోయినను అంతర్యుద్ధము అసంభవ మనియు సమంజసముగ, సునిశితమగు వాదనలతో నిరూపించియున్నారు.

రామకృష్ణరావుగారు, ఆంధ్రయువజన కాంగ్రెసునకు అఖండ సేవచేసిన యువకాగ్రగణ్యులు, ఆంధ్రరాష్ట్ర మోడరన్ రైటర్సు కాంగ్రెసు సంస్థాపకులు, అధ్యక్షులు: నిరంతర దేశసేవాపరాయణులు. ఇట్టివారు శ్రమపడి, ప్రచురించిన యీగ్రంథమును ఆంధ్రులెల్లరు సాకల్యముగ చదివి భారతదేశస్వాతంత్ర్య సంపాదనా యత్నములో తోడ్పడగలరనియు, యీ రచయితకు యింకను యిట్టి గ్రంథముల రచించుటకు ప్రోత్సాహమొసంగ గలరనియు యాశించుచున్నాను.

కళా వెంకటరావు.

బెజవాడ } ఆంధ్రరాష్ట్రకాంగ్రెసు ప్రధాన కార్యదర్శి
15-4-46 } మద్రాసు శాసనసభా సభ్యులు.

# అభిప్రాయం

పాకీస్థాన్ - మార్క్సిజమ్ అను నీ చిన్ని పొత్తము ను అముద్రిత దశలోనే నేను చదివితిని - రచయిత ఆంధ్ర విశ్వ విద్యాలయ పట్టభద్రుడు. ఊరక పాఠ్యగ్రంథములను బట్టీబట్టి ముక్కున పెట్టుకొని పరీక్షలలో నెగ్గిన వాడుగాడు. తనకు అభిమాన శాస్త్రమగు "శాస్త్రీయ సామ్యవాదము" పై అనేక గ్రంథములు వల్లెవేసినవాడు. మార్క్సిజమును గూర్చిన బహు గ్రంథ పరిశీలన గావించినాడు. "పసరులు గీతముంజిలుకు బాలరసాలమువంటి రసహృదయము" కలవాడు. పఠించిన బహు గ్రంథస్థ విజ్ఞానాన్ని ఆధునిక సమస్యల కన్వయింపజేయు తితీక్షగల వాడు, ప్రతి విషయాన్ని సునిశితంగా వివక్షించగల్గిన మేధావి. ఉడుకు నెత్తురుయొక్క ఉద్వేగ తీవ్రత అందందు కానవగును.

ఆంధ్రదేశంలో ప్రజాహిత జీవనంలో చురుకుగా పాల్గొంటూవున్న నేనెరింగిన యువకులలో జాతిరత్నము వంటివాడు. ఇతని ప్రజ్ఞ సర్వతోముఖమని నేనెరుంగుదు. గేయాలలో, వ్యాసాలలో, ఉపన్యాసాలలో ఇతని ప్రతిభ ఝరీవేగంతో ప్రవహిస్తోంది. జయప్రకాశ నారాయణ ఇతని ఆరాధ్య దేవత. కార్లైలు చెప్పినట్లు ఆరాధ్య దేవత

లక్షణాలు కొలదిగానో గొప్పగానో భక్తునిలో వుంటవి. లేనిచో పూజ్యభావము కుదురదు. ఆంధ్రలో సోషలిస్టు ఉద్యమాన్ని నిర్మించాలని ఇతని ఆరాటం. అందుకోసం ఇరువది నాల్గుగంటలు ఇతని బుర్ర వేడెక్కుతూ ఉంటుంది. ఉజ్జ్వలమైన భవిష్యత్తువున్నదని నావిశ్వాసం. అతని అభిప్రాయాలు పెక్కింటితో నే నేకీభవించ లేకపోయినా అతని సౌజన్యం, ఉన్త్రలసం నన్ను మిక్కిలి ఆకర్షించినవి.

బెజవాడ<br>15.4.46

ఇట్లు,<br>మైనేని రామకోటయ్య బి. ఏ.

# నా మాట

అనంతమైన ఈ ప్రపంచ పరిస్థితులవొంక నొకసారి తేరిపారజూచి, మానవ సమాజపు వునికికి పీఠమయిన వివిధ విషయాలకు శాస్త్రీయదృక్పథంతో విలోకించి విమర్శించి, విపులీకరించుకున్న పిదప, పాలితపాలక, పీడితదోపిడి, శ్రామికదోపిడి వర్గాలతో కూడుకున్న నేటి సమాజిక పరిస్థితులను పూర్తిగా నిర్మూలనంచేసి ధర్మాన్ని, న్యాయాన్ని, సమతను, సర్వమానవ భ్రాతృత్వాన్ని నెలకొల్పి స్త్రీ పురుష విభేదములు, కులమతతారతమ్యములు లేకుండా అనేకమంది రాజఋషులు వూహించిన, వూహించుతున్న స్వాతంత్ర్య శాంత్యభ్యుదయములతో కూడుకొన్న వర్గరాహిత్య సమాజాన్ని నెలకొల్పాలంటే రాజఋషిపుంగవుడు మార్క్సు బాటే అందుకనువైన రాజబాటనీ నేను గ్రహించాను. మార్క్సు చెప్పిన - సోషలిజం తప్పకుండా అమలు జరిగి జయంపొంది తీరుతుందని ప్రతి హేతువాది ఒప్పుకు తీర్వాడు. "సోషలిజం అమలు జరగక తప్పదు" అని ప్రపంచ ప్రఖ్యాత పురుషుడు ఆంగ్లేయ కవిపుంగవుడు ప్రముఖ బ్రిటిషు సోషలిస్టు జార్జి బెర్నార్డ్‌షా అన్నారు.

ప్రపంచప్రజలందరు, విజ్ఞానవేత్తలు, కార్మికకర్షక వర్గాలు, ఒకరననేమి – సంఘంలోని, ఎక్కువమంది–సోషలిజంవైపుకు మొగ్గడం చూచి తమ పలుకుబడికోసము

మేమూ మార్క్సిస్టులమేనని చెప్పుకుంటూ ప్రజలను మోసగించుతూ వచ్చే అవకాశవాదులు నేడు మనకు కన్పించుతున్నారు. మార్క్సిజం పేరుతో పొరపాటున తప్పులు చేసేవారూ లేకపోలేదు. కాని ఆ తప్పులు దిద్దుకున్నప్పుడు వారు సరైన మార్క్సిస్టులు కాగల్గుతారు.

నేటి భారతకమ్యూనిస్టులు ఈ అవకాశవాదుల తరగతికి చెందినవారే. కాకపోతే వారు తప్పుత్రోవను పడితే సవరించుకోవలసింది. లేకపోగా తమ తప్పిదాలనే ఒప్పులని 'ఫాసిస్టు గోబెల్సు ప్రచారం' మొదలుపెట్టారు. మతము – మార్క్సిజము ఉత్తరదక్షిణ ధృవాలు. రెండు పరస్పర విరుద్ధములు. మార్క్సిస్టుదృష్టిలో పాకిస్థాన్ ఫాసిస్టు పీఠం మాత్రమే. అట్టి పాకిస్థాన్‌ను సమర్థించే భారతకమ్యూనిస్టులు (నామధారులు!) ఫాసిస్టులుమాత్రమే కాని వేరొండుకాదు. ప్రముఖ బ్రిటిషు కమ్యూనిస్టు నాయకుడు, ఇప్పుడు అమాత్యత్రయ రాయబార సంప్రతింపుల సమయంలో ఆంగ్లేయ కమ్యూనిస్టు పత్రిక డెయిలీ వర్కరుకు విలేఖరిగా వచ్చిన 'రజనీ పామీదత్తు' జిన్నా కోరే పాకీస్థాన్ అసంభవమని, పనికిరాదని చెప్పాడు. భారత కమ్యూనిస్టులు నావాదం సరైనదని ఒప్పుకోనందుకు వారి నాయకుడు పామీదత్తు చెప్పినదానికంటె నాకు ఎక్కువ బలంఅవసరంలేదు. ఈపుస్తకంలో ప్రముఖ భారతకమ్యూ

నిస్టుల "కమ్యూనిస్టులు ముస్లింలీగును ఎందుకు బలపరుస్తున్నారు" అనే చిన్నిపొత్తమునుండి వారి అభిప్రాయాలనే తీసుకుని మార్క్సిస్టుదృక్పథంలో అవితప్పని సహేతుకంగా ఋజువు చేశాను. ఈ పుస్తకంతో ఈ కమ్యూనిస్టుల బండారం బయటపడక తప్పదు.

పుస్తకాన్ని పరిశీలించి పీఠిక వ్రాసియిచ్చిన ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు సంఘ ప్రధాన కార్యదర్శి శ్రీయుత కళా వెంకట్రావు M. L. A. గారికి, అభిప్రాయం వ్రాసి యిచ్చిననా 'అగ్రజుడు' శ్రీయుత మైనేని రామకోటయ్య B. A. (ఆంధ్రయువజన కాంగ్రెసు నాయకులు) గ్రంథ రచనకు ప్రోత్సాహించిన సోదరులు రామకుమారవర్మ, శ్రీ వల్లూరిపల్లి సుబ్బారావు, శ్రీ శ్రీ కాకుళం వెంకటేశ్వర్లుగార్లకు పుస్తక ముద్రణాభారాన్ని తనపై వేసుకు నెరవేర్చిన సోదరులు శ్రీయుత వల్లభనేని కాశీవిశ్వనాధం గారికి నామనఃపూర్వక సోషలిష్టు విప్లవాభివందనములు.

అయినంపూడి,
16—4—46.

ఇట్లు,
బలుసు రామకృష్ణరావు బి. ఏ.,

# మతము—మార్క్సిజము

"మతము ప్రజలపాలిట మత్తుమందు" మార్క్సు. ఈ సువచనాలు రష్యాలో పెద్దపెద్ద బిల్డింగుల గోడలపై వ్రాసివున్నయ్యి.

"మతము గమ్యస్థానం చేరే స్వాతంత్ర్య పథంలో ముళ్ళకంప వంటి అడ్డంకు" లెనిన్.

"మతానికి రాజకీయాలకు సంబంధం వుండరాదు"- మహాత్మాగాంధీ.

"నిజమయిన మతతత్వం భయంకరం. కృత్రిమ మతతత్వం రాజకీయప్రతీఘాతం" పండిత్ జవాహర్ లాల్ నెహ్రూ.

మతమహామ్మారిని గురించి అనేకకోట్ల పీడిత పతిత ప్రజానీకానికి ప్రాతినిధ్యం వహించిన ఆప్రజా నాయకుల వాణి ఇచ్చిన దివ్యసందేశాల ప్రతిబింబాలే ప్రతిధ్వనులే – ఈ సువచనాలు. రాజకీయోద్యమాల ముందుకు నడపి తమతమ పంథాలతో భావాలతో ప్రజానీకానికి మేలు గూర్చిన తత్వవేత్తలను కాలానుగుణ్యాంగా శాస్త్రీయంగా అనుసరించవలసిందే గదా! అందుకునే పై పెద్దలమాటలను దృష్టిలో వుంచుకుందాం!

దేశంలో మతసంస్థలేవి? ముస్లింలీగ్ హిందూ మహాసభ, కాంగ్రెస్ సంస్థ, స్వయంసేవకాసంఘము. వీటి

పాత్ర ఎట్టిది? నిస్సంకోచంగా వీటిపాత్ర ఫాసిస్టు రాజకీయ పాత్రే. అదెలాగో ముందు చూద్దాం.

ఇంకా కొన్ని ముస్లింసంస్థ లున్నాయి. అవి అహ్రారున్న, జమయత్ ఉల్ ఉలేమా, కృషికప్రజాపార్టీ మొదలయినవి. ఇవన్నీ బానిసభారత దేశంలో జాతీయ స్వాతంత్ర్యంకొరకుబ్రిటిషుసామ్రాజ్యవాదంతో నిరంతరం పోరుసల్పుతున్న భారత జాతీయ కాంగ్రెసుతో చేతులు కలిపి కదంతొక్కుతూ పదంపాడుతూ ముందుకు సాగి వస్తూ అభ్యుదయపంథాను అనుసరిస్తున్నాయి.

నేడు కమ్యూనిస్టు నామధారులు ముస్లింలీగును పూర్తిగా బలపరుస్తున్నారు. అలా బలపర్చడం మార్క్సిస్టుపంథా అని కోతలు కోస్తున్నారు. వీరి వుద్దేశం మార్క్సిజం వారికి మినహా యితరులకు తెలియదని గాబోలు! అంతేకాకుండా మార్క్సిజం వారి సొమ్మేనని యితరులకు దాన్ని గురించి మాట్లాడే హక్కయినా లేదనే అహంభావంతో మాట్లాడుతూవుంటారు. వారు మినహా యితరులు మార్క్సిస్టులు కాలేరంటారు. ఈ కమ్యూనిస్టుల యిటువంటి అవకతవక సంకుచిత అహంభావం వారిని పోనుపోను ఫాసిస్టుపంథాలోకి తీసుకుపోతూంది, అదెలాగో శాస్త్రీయంగా ఆలోచిద్దాం.

"ముస్లింలీగును బలపరుస్తున్నాం. బలపరుస్తాం కూడా. ఇదిరైటు" అని కమ్యూనిస్టులే అంటున్నారు. గనుక, వారు మతసంస్థలను బలపరుస్తున్నారని చెప్పేందుకు యితరత్రా ఋజువులు మరేం అవసరంలేదు. మన మనే దేమంటే అసలు మతతత్త్వమే ఫాసిజం అని! మత తత్వాన్నిగాని, ఆవాదుల్నిగాని బలపర్చేవారు ఫాసిస్టులని. ఎందువలన?

మతం ఏంచెపుతోంది? మతం దేవుడు, దెయ్యం, భూతం అనే మానవాతీతములయిన శక్తులున్నయని ఒప్పుకుంటూంది. కాని ఆధునికశాస్త్రము మానవాతీతం ఏమీలేదని ఋజువుచేసింది. మానవుడు తన కతీతమయినది వున్నదని ఒప్పుకున్నపుడు భావదాస్యం చేస్తాడు. భావదాస్యం వెనువెంటనే కార్యాచరణలో దైనందిన జీవితంలో భౌతికదాస్యానికి తీసుకుపోతుంది. ఇది మనం చూస్తూనే వున్నాము. ఫాసిజం ఏమి చెపుతుందంటే రాజ్యాంగయంత్రానికి, పరిపాలకునకు(నియంతకు) మించిన గొప్పవారు లేరని ఆయన దైవాంశ సంభూతుడనీ పిచ్చి మోసపుకబుర్లు చెబుతుంది. కనుక మతతత్వం ఫాసిస్టు తత్వానికి మూలకందం అన్నమాట. అయినప్పుడు ఈ పాసిస్టు మతతత్వాన్ని బలపర్చే యీ భారత కమ్యూనిస్టులు ఫాసిస్టులే అవుతున్నారు కదా?

చరిత్రను విప్పి చూద్దాం. మతం ఏం చేసిందో అప్పుడు తెలుస్తుంది. అసలుసరుకు చూడండి, స్పెయిన్ ను పరిపాలించిన నాల్గవ చార్లెస్ విషయం ఆలోచించండి. ల్యూథర మతతత్వానికి వ్యతిరేకి అయిన లూథర్ వాదాన్ని ఎందుకువ్యతిరేకించాడు చార్లెస్,? లూథర్ వాదం బలపడితే లూథర్ కు ఒకపార్టీ ఏర్పడితే ఆ పార్టీ తన సామ్రాజ్య తత్వంమీద ఎదురుతిరుగుతుందనే కదా? చూడండి, ఇక్కడ మత తత్వాన్ని పరిపాలకులు ఎలా సామ్రాజ్య స్థిరీకరణ కుపయోగించుకున్నారో ?

ఇక ఇంగ్లండు వెళదాం, ఎనిమిదవ హెన్రీని చూద్దాం, కాథలిక్కు మతంనుండి ప్రొటెస్టెంటు మతంలోకి యీాయన ఎందుకొచ్చాడో తెలుసా ? తనమొదటి భార్యను వదలి మరోచక్కని పిల్లని పెండ్లి చేసుకోనేందుకు! ఇది యిక్కడమతం, స్త్రీలకు చేసిన గొప్పఅపకారం ! తీరని అపకారం !

అసలు మత అహంభావత్వం చాలా ప్రమాదమైంది. నాది అనే దురహంకారం, చెడ్డ జాతీయవాదానికి (మంచి జాతీయవాదం. చెడ్డజాతీయ వాదం ఒకటి కాదు సుమండి!) త్రోవతీస్తుంది. జర్మనీ లోని ప్రష్యా పరిపాలకుడయిన ఫ్రెడరిక్ రాజు మంత్రి బిస్మార్కు ఇలాంటి దురహంకార జాతీయవాదాన్ని

పెంచేసరికి జర్మను ప్రజల హృదయాల్లో హత్తుకుపోయిన ఆ దురహంకారము తుట్టతుదకు హిట్లరు ఫాసిజానికి దోహదమిచ్చి సామ్రాజ్యవాదంలోకి దింపింది. ఆలాగే ఇండియాలోకూడా మా ఇస్లాంమతము, మా హిందూ మతము అనే యీ వుపయోగం మాలిన దురహంకార వాదాలు జాత్యహంకారాలకు, జాత్యహంకారాలు ఫాసిస్టు సామ్రాజ్యవాద విధానాలకు ప్రోవతీయక తప్పదు. అసలు హిట్లరు దౌష్ట్యాలకు కారణం ఏమంటారు ? దుర హంకార పూరితమయిన అతని జాత్యహంకార తేకదా? అలాగే మత దురహంకారత కూడా అలాంటి ఫాసిస్టు విధానానికి ఎందుకు ప్రోవతీయదు ? ఏ అహంకార మయినా పిచ్చివాదానికే ప్రోవతీస్తుంది. అది అహం కార భావంలోవున్న సహజతే !

అసలు మతం ఏమి చెబుతోంది ? దేవుడున్నా డని, దాన్ననుసరించి కర్మసిద్ధాంతం రైటని చెబుతూ వుంది. కర్మ సిద్ధాంత మేమంటుంది ? ధర్మ కర్తృత్వ సిద్ధాంతం అంటుంది. అంటే ధనికులు వారి పూర్వజన్మ పుణ్యకర్మలవల్ల ధనికులుగాను, బీదలు తమ పూర్వజన్మ పాప కర్మలవల్ల బీదలుగాను పుట్టారని, వారిద్దరు వారి వారి ధనిక బీదత్వాలతో వుండక తప్పదనే కర్మసిద్ధాంతం చెబుతూంది. మరి ఫాసిజం ఏమి చెబుతోంది. పై విష

యాన్నే మరోమాటల్లో చెబుతూంది. ధనికులు బీదలు కలసి వుండాలట. ఇద్దరు కలసి రాజ్యాంగ యంత్రాన్ని సుస్థిరంగా వుండేటట్టు చేయాలట! కాని రాజ్యాంగ యంత్రం ఎవరిది? ధనికులది! అయితే బీదలకి వచ్చే దేమిటి? దారిద్ర్యం! ఆకలి!! బాధలు!!! చావు!!!! కనుక ఫాసిజానికి మతతత్వానికి తేడా ఏముంది? ఏమీ లేదు? నిశ్చయంగా తేడా ఏమీలేదు!! కాబట్టి పై జెప్పిన మతసంస్థలు ఏవైనా ఫాసిజానికే త్రోవతీస్తాయి.

అందువలన, యీ మతసంస్థలను- అంటే మత తత్వం మతసంస్థలను బలపర్చే యీ భారతకమ్యూనిస్టు నామధారులు ఫాసిస్టులు ఎందుకుకారు? నిస్సంశయంగా యీ కమ్యూనిస్టు నామధారులైనవారు అనుసరిస్తూ వున్న మతతత్వ అహంకార పంథావలన ఫాసిస్టులే!

యీ కమ్యూనిస్టులు మార్క్సిస్టుల మంటారు? మార్క్సిజం వర్గకలహం కోరుతుంది. వున్నతవర్గాల పరిపాలనను నాశనం చేయాలంటుంది! మతం వున్నత వర్గాల పరిపాలన వుండి తీరాలంటుంది! వర్గసామరస్యం దాని ఫలితమంటుంది? మార్క్సిజానికి మతానికి ఎట్టి సంబంధం ఉంది? రెండూ వుత్తర దక్షిణ ధృవాలే. అందువలన యీకమ్యూనిస్టులు మార్క్సిస్టులు కాదు కందా! మరి అయితే ఫాసిస్టు తత్వమయిన మత తత్వా

నికే ప్రోత్సాహిస్తున్నారుకదా! అందువలన యీ కమ్యూనిష్టులు పేరుతో కమ్యూనిస్టులయినా అసలు కార్యాచరణలో ఫాసిస్టులే కందా?

ముస్లింలీగే కాదు. ఏమత సంస్థలయినా పైచెప్పిన కారణంవల్ల ఫాసిస్టుసంస్థలే అవుతాయి. ఈవిషయం బాగాజ్ఞప్తిలో వుంచుకోవాలి, ఎవరయినా సరే!

—:♦:—

# ఫాకిస్థాన్ - మార్క్సిజం

"ముస్లింలీగును బలపరుస్తున్నాం. బలపరుస్తాం కూడా. బలపర్చడం న్యాయం కూడా" ఇది కమ్యూనిష్టుల వాక్, లిఖిత పూర్వకమయిన ప్రచారక పదజాలం. ముస్లింలీగును బలపర్చడం న్యాయం గనుక బలపరుస్తున్నారన్న మాట కమ్యూనిష్టులు. ఇలా బలపర్చడం ఏ వుద్దేశ్యంతోనో తెలుసుకోవాలి. "లీగు ప్రముఖ ముస్లిం ప్రజాసంస్థ కావడం వల్లమాత్రమే కాదు మేము దాన్ని బలపర్చేది - దాని మూలసూత్రమైన ముస్లింజాతుల నిర్ణయసూత్రాన్ని మేము న్యాయమంటున్నాం కనుక కూడా లీగును బలపరుస్తాం" ఇది కమ్యూనిష్టుల వాదం. అంటే జిన్నా అనే

ముస్లింలు ఒక ప్రత్యేకజాతి అనేనిర్వచనాన్ని కమ్యూనిష్టులు ఒప్పుకుంటున్నారన్న మాట. జిన్నా మతసంస్థయైన ముస్లింలీగు నాయకుడు. కమ్యూనిస్టులు 'మార్క్సిజాన్ని' తమ ఆశయంగా తీసుకు పనిచేస్తామని చెప్పుకుంటున్నారు.

జిన్నా, కమ్యూనిస్టులు ఇద్దరు ఒకే లైనుమీద 'జాతి'ని నిర్వచిస్తున్నపుడు మతతత్వవాదంతో కమ్యూనిస్టు ఏకీభవిస్తున్నారన్నమాట. మతతత్వవాదం ఫాసిజానికి మూలకందం అని 'మతము – మార్క్సిజము' అనే వ్యాసంలో నేనిదివరకే ఋజువుచేశాను. కనుక భారత కమ్యూనిస్టులు ఫాసిస్టు రాజకీయపాత్రను నిర్వహిస్తున్నట్టు ఇక్కడ వేరుగా చెప్పనవసరం లేదు.

స్టాలిన్ మార్క్సిజాన్ని అభివృద్ధిచేశాడని కమ్యూనిస్టులు చెబుతున్నారు. ఆస్టాలినే 'జాతి'కి నిర్వచనం ఎలా ఇచ్చాడో చూడండి. ఒకేభాష, ఒకే ఆర్థికవిధానము, ఒకే సంస్కృతి, ఒకే నాగరికత కల్గి ఒకే భూగోళ నిర్దేశిత ప్రదేశంలో నివశిస్తూ చరిత్రాత్మకంగా అభివృద్ధిచెందిన ఒక ప్రజాసమూహం జాతి అని అనబడుతుంది. (స్టాలిన్– జాతుల సమస్య). నిజంగా మార్క్సిజాన్నే గనుక ఈ కమ్యూనిష్టులు అనుసరిస్తున్నట్లయితే 'ముస్లిం జాతులు' అని కమ్యూనిష్టులు వాడుతున్న పదం స్టాలిన్ చెప్పిన నిర్వచనానికి సరిగ్గా వుండాలి.

ముస్లింలందరు ఒకే భూగోళసరిహద్దుల ప్రదేశంలో వుంటున్నారా ? వారందరి మాతృభాషా ఒకటేనా ? వారందరి సంస్కృతీ ఒకటేనా ? వారందరు చరిత్రాత్మకంగా ఒకటిగానే అభివృద్ధిచెందారా ? లేదు. వారు వివిధరాష్ట్రాల్లో నివశిస్తున్నారు. ఏ రాష్ట్రంలో వారు ఆ రాష్ట్రభాషనే వుపయోగిస్తున్నారు. అంతేకాని వారి వ్యవహారాలు వుర్దూలో జరగడంలేదు. పంజాబులోని బెంగాలులోని, ఆంధ్రాలోని వివిధ ముస్లింప్రజల సంస్కృతి ఒకటిగాదు. ఆప్రాంతాన్నిబట్టి వారి వార్తాపత్రికలు, వేషభాషలు వుంటున్నాయి. ముస్లిం లందరిచరిత్ర ఒకటిగాదు. వివిధ ప్రజాసమూహాలకు అసలు భారతదేశంపై దాడిచేసిన ముస్లింలకుగల సాంఘిక సంబంధంవల్ల వివిధ రాష్ట్రాల్లోని ముస్లింలు వుత్పన్నమయ్యారు. మార్క్సిజం ప్రకారం మతానికి జాతి నిర్వచనంలో స్థానమే లేదు. మతంవల్ల జాతి ఏర్పడితే ఇంగ్లీషువాళ్ళు, అమెరికావారు ఒకేజాతికి చెందాలికదా ? వారిద్దరూ ఒకే జాతికి జెందితే అమెరికా బ్రిటనుపై స్వాతంత్ర్య యుద్ధాన్ని ప్రకటించి బ్రిటను పరిపాలననుండి ఎందుకు వేరుపడవలసి వస్తుంది? కనుక జాతికి మతానికి సంబంధం లేదని చరిత్ర చెబుతోంది.

అందువల్ల ముస్లింలీగు మహమ్మదీయుల జాతీయ సంస్థ అనడం పొరపాటు. మహమ్మదీయులే ఒక జాతి కానపుడు ముస్లింజాతీయ సంస్థ అనే పిచ్చిపదం దేనికి? కాని కమ్యూనిస్టు లేమంటున్నారంటే "ఈ ప్రధాన జాతీయసంస్థలు రెండూ పోరాడితే దుష్టశక్తులే పైకి వస్తాయి" అంటున్నారు.

ఈ ప్రధాన జాతీయ సంస్థలు - ఒకటి కాంగ్రెసు, రెండవది ముస్లింలీగు, ముస్లింలీగు జాతీయ సంస్థ కాదని ఋజువు చేశాం. కుల మత వర్గ విభేదాలు లేకుండా అన్ని రాష్ట్రాల్లోని ప్రజలయొక్క స్వాతంత్ర్యంకొరకు (బ్రిటిషు పరిపాలననుండి విముక్తి కొరకు) కాంగ్రెసు పోరాడుతోంది. కాబట్టి భారత దేశంలోని వివిధజాతులకు కాంగ్రెసు జాతీయ సంస్థ. కాంగ్రెసులో అన్ని మతాలవారూ వున్న సంగతి మనకు విశదమే. కమ్యూనిస్టులు ముస్లింలీగు ముస్లింల ప్రతినిధి సంస్థ అంటున్నారు. హిందువులకు తానని హిందూమహాసభ, సిక్కులకు తానని సిక్కు సంస్థ, రైతు, కూలీలకు తానని కమ్యూనిస్టు పార్టీ, ప్రతినిధి సంస్థలుగా చెప్పుకుంటున్నాయి. ఏమతానికి ఆ మతానికి, ఏ వర్గానికి ఆవర్గానికే ప్రత్యేక సంస్థలు వుంటే అసలు కాంగ్రెసులో వుండేవరు? అటువంటి సందర్భంలో కాంగ్రెసులో "గుండుమున్నా" కన్నా

ఎక్కువ ఏమీ వుండదు, కానపుడు కాంగ్రెసును జాతీయ సంస్థ అని పిలవడం దేనికి ? కమ్యూనిస్టులు రైతు-కూలీలకు తాము ప్రతినిధులమంటున్నారు. అయినప్పుడు ముస్లింలీగు ముస్లిం ధనికులకేగా మరి ప్రాతినిధ్యం వహించేది. అయినప్పుడు "లీగు ప్రముఖ ముస్లిం ప్రజాసంస్థ కావడంవల్ల మాత్రమేకాదు దాన్ని మేము బలపర్చేది" అని కమ్యూనిస్టులు చెప్పడం దేనికి? ముస్లింలీగు కమ్యూనిస్టులు చెప్పే వాదంప్రకారం చూస్తే తార్కికవాదం ముస్లింలీగు ముస్లింధనికులసంస్థఅనిచెబుతూన్నప్పుడు అది ముస్లిం ప్రజా సంస్థ ఎలా అవుతుంది ? కనుక ముస్లింలీగు ముస్లిం ప్రజల సంస్థ అని చెప్పడం శుద్ధ 'బూతు' అన్న మాట. కనుక కమ్యూనిస్టులు చెప్పిన విధంగా రెండు జాతీయ సంస్థలు వుండటం గాని, మత తత్వరీత్యా జాతీయ సంస్థలు వుండటం గాని తార్కిక వాదానికే వ్యతిరేకము. భౌతిక తార్కికానికి వ్యతిరేక మయింది. యధార్థానికి వ్యతిరేకమని అభివృద్ధి నిరోధకమని మార్క్సిస్టు అయిన భౌతికవాది ఒప్పుకోవలసిందేగా ? అయినప్పుడు కమ్యూనిష్టులు చెప్పేది మరేలా సబబంటారు? వారు చెప్పేదాంట్లో అసలు ఎందులో సబబుంది గనుక యిందులో వుండేదుస్తుందిలెండి !

అసలు కమ్యూనిష్టులన్నట్లు ముస్లింలీగు "ముస్లిం ప్రజాసంస్థ" అవునా? కాదని మనం అంటాం. ఎందువల్లనో ముస్లింలీగ్ చరిత్రనుండి చూడండి. ఖిలాఫత్ వుద్యమం తీసుకోండి. ముస్లిం ప్రపంచానికంతకూ ఒక ముస్లింమత గురువుంటాడు. ఆతని మతసంబంధమైన హక్కును బ్రిటిషు ప్రభుత్వం టర్కీపై లేకుండా తీసివేసింది. బ్రిటిషుప్రభుత్వపు ఈచర్యపట్ల అసమ్మతిగా ఇండియాలోని ముస్లింలు ప్రభుత్వంపై ఎదురుతిరిగి సత్యాగ్రహం సాగించారు. ఈసమయంలో జిన్నా ముస్లింల తరఫున పనిచేయకుండా కూర్చుంటే ఆ ఖిలాఫత్ వుద్యమానికి గాంధిజీయే నాయకత్వం వహించి నడిపాడు. ఆవుద్యమంలో గాంధీజీ ముస్లింల హక్కుల కొరకు పోరాడితే ముస్లింలీగు జిన్నా వెనుకడుగువేశాడు.

లాహోర్ సంస్థానంలో నవాబుగారు ముస్లిం ప్రజానీకంపై చెల్లించలేనంత పన్నులు విధించాడు. చెల్లించలేని రైతుల్ని అరణ్యాలకు తరిమారు. జిన్నాగారూ ముస్లింలీగూ, నవాబు దేవాంశసంభూతుడని, అందువలన ఎంత పన్నులు విధించినా చెల్లించితీరాలని నవాబును సమర్థించారు. ఇటువంటి జిన్నాగారి నాయకత్వంక్రింద నడిచే ముస్లింలీగు ముస్లిం ప్రజాసంస్థట! కాబట్టి ముస్లిం

లీగు ప్రజాసంస్థని కమ్యూనిస్టులు చెప్పేవాదం శుద్ధ బూతన్న మాట.

అదీకాకుండా ముస్లింలీగు నాయకత్వం అభివృద్ధి నిరోధకమయ్యిందన్న సంగతి మన మెరుగందికాదు. ముస్లింలీగుకు నాయకత్వం వహిస్తూ, ముస్లింలీగుకు సంబంధించిన వ్యవహారాల్లో ముందుకుర్చీల నాక్రమించే ముస్లిం ప్రముఖులందరూ "ఛాంబర్ ఆఫ్ కామర్స్", నరేంద్రమండలి మొదలయిన ధనాఢ్యుల, జమీందారీ సంస్థల విషయంలోకూడా ముందుకుర్చీల నాక్రమించుతారెందువలన? ఇటువంటి నాయకత్వం క్రిందవుండే సంస్థలను ప్రజాసంస్థలని మార్క్సిజం ఒప్పుకుంటుందా?

కనుక ఈ పాకీస్థాన్ ముస్లింధనాఢ్యుల తంతని తేలింది. అసలు మతం ఎప్పుడూకూడా చరిత్రలో ధనికులకూ, సామ్రాజ్యవాదులకూ మాత్రమే వుపయోగపడినట్లు చూస్తున్నాం. ఈవిషయం "మతము – మార్క్సిజము" అనే వ్యాసంలో స్పష్టంచేయబడింది. నిజంగా ఈ పాకీస్థాన్ తంతు బ్రిటిషు సామ్రాజ్యవాదులకు, ముస్లిం ధనాఢ్యులకు మధ్య జరిగిన లాలూచీయొక్క తంతు మాత్రమే. ఈవిషయాన్నే కమ్యూనిస్టుపార్టీ కార్యదర్శి తన సహచరులకు వ్రాసిన రహస్యలేఖలో బయటపెట్టాడు. అమెరీ జిన్నాలనే రాక్షసులకు మధ్యజరిగిన

యీాబడంబడిక వున్నంత కాలం స్వతంత్రం యివ్వడం వుత్తదే నని తెలియజేశాడు. అందువల్లనే కాంగ్రెసు - లీగ్ ఐక్యతానినాదం యివ్వాలనికూడా వ్రాశాడు. అలా అంటూనే పార్టీని బలపర్చాలని వ్రాశాడు. ఇప్పుడు కాంగ్రెస్ - లీగ్ - కమ్యూనిస్టు ఐక్యత అని నినాదం ఇస్తున్నారు. అంటూనే "కాంగ్రెస్ నశించాలి" అని కూడా నినాదంచేస్తున్నారు. దీనితో ఈ ఐక్యతానినాదం బూటకం అనీ, కాంగ్రెస్ ముస్లింలీగుల పేర్లు వుపయోగించుకొని తమపార్టీని కమ్యూనిస్టులు బలపర్చుకొనేందుకు వేసిన ఆపర్చ్యూనిస్టు ఎత్తుగడని తేలింది. పార్టీని బలపర్చుకునేందుకు మత సంస్థల్ని అడ్డపెట్టుకోడము వర్గ ఆధిపత్య అంగీకారాన్ని సూచిస్తూంది కాని, వర్గప్రాబల్య వ్యతిరేకతను తెలియజేయడంలేదు. అందువలన ఈ కమ్యూనిస్టులుతమ ఆపర్చ్యూనిస్టు పంథావలన మార్క్సిస్టు వ్యతిరేకులే అవుతున్నారు.

అంతేకాకుండా స్టాలిన్ రష్యాల విదేశాంగ విధానాల చుట్టూ ప్రొద్దుతిరుగుడు పూవుల్లాగా తిరిగే యీ కమ్యూనిస్టులు స్టాలిన్‌మాటల ప్రకారం కాంగ్రెసును నాశనం చేసేందుకు మాత్రమే ఈ 'పాకీస్థాన్' ఇవ్వాలంటున్నారు. కాంగ్రెసును బలహీన పర్చడమంటే జాతీయోద్యమాన్ని బలహీనపర్చి తద్వారా సోషలిజానికి

ప్రథమ సోపానమయిన భారత రాజకీయ స్వాతంత్ర్యాన్ని వెనుకకు నెట్టుతున్నారన్నమాట! స్టాలిన్ పాకిస్థాన్ వుద్యమానికి డబ్బుయిస్తున్నాడని భోపాల్ నవాబుమంత్రి బయట పెట్టిన విషయం మనకువిశదమే. కమ్యూనిస్టుపార్టీ కార్యదర్శికి గవర్నమెంటుహోం మెంబరు మాక్స్‌వేల్‌కు రహస్య లేఖలు నడచినట్లు, అవి వ్రాసిన వారి ఇష్టం లేకుండా బయట పెట్టడానికి వీలులేదని గవర్నమెంటు సెంట్రల్ఎసెంబ్లీలో కాంగ్రెసు ప్రశ్నలకు సమాధానంగా చెప్పిన విషయమూ, పత్రికలలో ప్రకటితమయిన విషయమూ అందరకూ విశదమే. ఆరోజులలో బ్రిటనూ రష్యాసంధిలో వున్నమాటూ నిజమే. కాబట్టి ఈ తంతు ఏమిటో పాఠకులు గ్రహించాలి. ఈ కమ్యూనిస్టుల మార్క్సిజం ఎక్కడకు దిగజారుతోందో నిజమయిన మార్క్సిస్టు లందరూ గ్రహించాలి. ఇటువంటి వాళ్ళ కోసమే లెనిన్ 'ది టు టాక్టిక్స్'అనే పుస్తకం వ్రాశాడు. ఇటువంటి ఆ పర్యూచ్యనిస్టుల్నందర్నీ తూర్పార పట్టి వొదిలి పెట్టాడు.

పాకిస్థాన్‌ను ఒప్పుకోవడమంటే "విభజించి పరిపాలించు" పద్ధతిని అనుసరించే సామ్రాజ్యవాదుల కుట్రకు లొంగిపోవడమే. సామ్రాజ్యవాదులు ముస్లింల పాకిస్థాన్ ఒప్పుకోవాలని ఒకవైపునా, ఇండియా అంతా భూస్వాముల

శాస్త్రరీత్యా అవిభాజ్యమని ఒకవైపునా చెప్పడంమనలో మనకు తగవులు పెట్టడం కాక మరేమవుతుంది? ఈ దేశాన్నుండి వెళ్ళడానికి యిష్టంలేని బ్రిటిషువాళ్ళు ఈ పాకీస్థాన్ తంతును బలపరుస్తున్నారు. కాకపోతే ముస్లింల మాట అటుండగానే అంబేద్కరు షెడ్యూల్డు జాతుల ఫెడరేషన్‌ను గుర్తించి డబ్బా వాయించడమేమిటి? మతరీత్యా ఎన్నికల నియోజక వర్గాల నేర్పర్చడమేమిటి? మతరీత్యా నియోజక వర్గాల నేర్పరిస్తే మత సంస్థలకు ఆధిపత్యంవహించిన ధనాఢ్యులే ప్రయోజనం పొందుతారు గాని వెనుకబడివున్న బీదప్రజానమూహాలకు రైతుకూలీలకు లాభం ఏముంది? పైపెచ్చు హాని జరుగుతుందికూడా! కనుక బీదవాళ్ళకు హాని జరగడం మార్క్సిజానికి వ్యతిరేకమేకందా? కనుక బ్రిటిషు సామ్రాజ్యవాదులు, ముస్లిం ధనాఢ్యులు చేసిన ఈ పాకీస్థాన్ పాటకు వొంత పాడుతున్న కమ్యూనిస్టులు మార్క్సిజానికి వ్యతిరేకంగా పోతున్నారుకదా?

ఈనాడు పాకీస్థాన్ ఒప్పుకున్నామని మనం అంటే మళ్ళీ షెడ్యూల్డు కులాల విషయము, జమీందారుల, మహారాజుల విషయము, హిందూమహాసభ, సిక్కుల విషయము, క్రైస్తవుల విషయము, ఆంగ్లోయిండియన్ల విషయము, ఇండియాలోని బ్రిటిషువాళ్ళ విషయము,

ఇటువంటి అర్థం పర్థంలేని విషయాలు అనేకం తెస్తారు. బ్రిటిషువాళ్ళు, ఇవన్నీ 'విభజించి పరిపాలించు' పద్ధతి యొక్క ప్రతిబింబాలు మాత్రమే. ఈవిధానాన్ని సమర్థించడం, బ్రిటిషువాళ్ళ ఈ పాటలకు వంత వేయడం సోషలిజానికి ప్రప్రథమ సోపానమయిన సత్వర సంపూర్ణ స్వరాజ్య సాధనను వెనుకకు నెట్టి మార్క్సిజానికి వ్యతిరేకము కావడం తప్ప మరేమీ కాదు.

చైనాపై జపాను దండయాత్ర చేసిన రోజుల్లో టోజో ఫాసిస్టుకూడా చైనాను చీల్చి జయించేందుకు యిటువంటి పాకిస్థాన్ ఎత్తుగడనే ఎత్తాడు. చైనా ముస్లిం ప్రజానీకాన్ని ఛియాంగ్ కై షేక్‌తో విడిపోయిన పక్షంలో పాకిస్థాన్‌తో బహూకరిస్తానన్నాడు. కాని ఐక్యచైనాతో అజేయ చైనాగా చేసుకున్న చైనాలోని ముస్లిం దేశ భక్తులు టోజో వల్లో చిక్కుకోలేదు. చైనా కమ్యూనిస్టులు, ఇండియా కమ్యూనిస్టులు సామ్రాజ్యవాదులకు వంతకొడుతున్నట్టు టోజోకు వంత వేయలేదు. ఐక్యతను మాత్రమే ప్రధాన లక్ష్యంగా వుంచి టోజో జపానుల బారినుండి దేశాన్ని కాపాడుకున్నారు.

అసలు పాకిస్థాను కమ్యూనిస్టులు ఎందుకు బలపరుస్తున్నారంటే — "ఈపరిస్థితుల్లోనే పాకిస్థాన్, స్వయం నిర్ణయసూత్రం అనే నినాదాలు వచ్చాయి. బలహీన

జాతులు స్వాతంత్ర్య చైతన్యం పొందుతూన్నకొద్దీ సహజంగా బ్రిటిష్ పెత్తనాన్నుంచేగాక బలవంతులైన తమ సోదరజాతుల పెత్తనాన్నుంచికూడా స్వాతంత్ర్యం కోరుతారు. పూర్వం వారికిజరిగిన అన్యాయాల నన్నింటినీ సరిజేసుకొనే స్వాతంత్ర్యాన్ని, భవిష్యత్తులో పరాయి వాళ్ళ పెత్తనాన్నుంచి విడివడే స్వాతంత్ర్యాన్ని, వారి జన్మభూముల్లోవారే వారి ప్రజల భవిష్యత్తును నిర్మించుకొనే సంపూర్ణస్వాతంత్ర్యాన్ని వారు కోరుతారు." ఇందుకొరకు కమ్యూనిస్టులు పాకీస్థాన్‌ను బలపరుస్తున్నారట.

హిందువులు మెజారిటీగా వుండటంవల్ల కలసి వున్నందువల్ల హిందువులు వారిని అణగద్రొక్కుతారేమోనని ముస్లింలకు భయమట! అయినప్పుడు పంజాబు బెంగాలులలో సిక్కులకు, హిందువులకుమాత్రం పాకీస్థాన్‌లో ముస్లింలు వారిని అణగత్రొక్కుతారనే భయం ఎందుకు వుండకూడదు? కనుక 'పాకీస్థాన్' ఒప్పుకున్నప్పటికీకూడా ఒక మతాన్ని మరొకమతం అణగద్రొక్కుతుందనే భయంపోదు.

ఒక ప్రజాసమూహాన్ని మరొక ప్రజాసమూహం అణగద్రొక్కకుండా వుండాలంటే వ్యక్తిగతఆస్తులు లేని వర్గరాహిత్యమైన సోషలిస్టుసమాజం వుండవలసిందేగాని,

ధనికులు తమనుతాము రక్షించుకునేందుకు, తమ స్వార్థా లను కప్పిపుచ్చుకుని యింకాయింకా బీదలను దోచేం దుకు వుపయోగపర్చుకుంటున్న మతాలకుగాని మత సంస్థలకుగాని అవికోరిన ప్రత్యేక రాజ్యాలు యిచ్చి నంతట్లో అణగద్రొక్కడము, అణగద్రొక్కబడ్డము" అనే సమస్యలు అసలు పరిష్కరించనే బడవు. పై పెచ్చు మతతత్వరీత్యా రాజ్యాలు ఏర్పడితే యుద్ధం తథ్యం. మతం ఫాసిజానికి మూలకందమని, దురహంకా రమని తద్వారా సామ్రాజ్యవాద విధానాలకు పునాది అని ఆధారమని 'మతము-మార్క్సిజము' అనే వ్యాసంలో ఋజువు చేయబడ్డది. కనుక పాకీస్థాన్, హిందూస్థానీలు ఏర్పడ్డా వాటిరెంటికి మధ్య యుద్ధం తప్పదు. రెండూమత అహంకారంతో ఫాసిస్టు రాజ్యాలుగా మారకతప్పదు. ఈ మతఅహంకారమే కళ్ళకు కప్పుకు పోయినపుడు ప్రజ లలో సోషలిస్టు చైతన్యం రావడానికి సనేమీా వీలుండదు. వుదాహరణకుఫాసిస్టు అహంకారంగల జర్మనీలోమార్క్సి స్టుపార్టీలు పెరగి పెద్దవవడం అసంభవ మయ్యింది. కనుక పాకీస్థాన్ ఒప్పుకోవడము మార్క్సిజానికి వ్యతిరేకమనే తేల్తోంది.

పాకీస్థాన్ హిందూస్థాన్ ఏర్పడితే యుద్ధాలు తప్పవన్నాము, 'ముస్లింమతము ప్రమాదంలో వుంది'

అనే ముస్లింలీగు నినాదానికి 'జర్మన్‌జాతి ప్రమాదంలో వుంది' అనే హిట్లరు నినాదాలకు ఏమాత్రం తేడా లేదు, ఇద్దరూ ధనికుల ప్రాబల్యాన్ని తీసుకొచ్చేందుకు, సామాన్య ప్రజానీకాన్ని చైతన్య రహితులుగా జేసి మోసపుచ్చేందుకే ఇటువంటి నినాదాలను అమలులో బెట్టారు. జిన్నాకు ముస్లిం ప్రపంచానికే అధినేత కావాలనే వుద్దేశ్యం వుంది. ముస్లిం సామ్రాజ్య స్థాపనే జరిగితే అందులో ముస్లిం సామాన్య బీదప్రజానీకానికి రక్షణవుండటం అసంభవం. సామ్రాజ్యవాదంలో దోపిడే జరుగుతుంది. గాని బీదలకు రక్షణవుండదు. దీనికి కారణమేమంటే సామ్రాజ్యవాద పెట్టుబడిదారీ పరిపాలనలో యుద్ధసామగ్రి మొదలయిన నిరుపయోగకరమయినవి తయారుచేయడము, అందుమూలంగా కూలీలకు వేతనాలు తగ్గించడము, బీదరైతుల నోళ్ళుకొట్టడము. భరించలేని శిస్తులు వేయడమే సంభవిస్తుందిగాని, ప్రజలకు వుపయోగకరమయిన సరకుల వుత్పత్తిజరగదు. అందువలన పాకిస్థాన్ బీదలకు నిరుపయోగమే అవుతుంది.

పైపెచ్చు పాకిస్థాన్, హిందూస్థాన్‌లకు మధ్య యుద్ధాలు జరుగుతూంటే, బడ్జెటంతా యుద్ధఖర్చులకేగాని ప్రజోపయోగాలకు వుపయోగించదు. ఇదే నాజీజర్మనీలో సరిగ్గా జరిగినపని. డబ్బంతా యుద్ధసామగ్రికి సైన్యాలకు

వుపయోగించడంబీదలనోట్లోగుప్పెడుచవిటి దుమ్ముకొట్టడం జరుగుతుంది. ఇలా రెండుభాగాల్లోను జరగడం రెండుభాగాల్లోని బీదలకూ నష్టమే. విద్య, విజ్ఞానము, సంస్కృతి నశించుతాయి. ప్రజానీకాన్ని విద్యాగంధం లేకుండాచేసినా డే ధనికులుఆడే ఇటువంటి ఆటలుసాగుతాయి. ఇలా బీదలకుఅన్యాయం మార్క్సిజం ఒప్పుకుంటుందా? అయినప్పుడు యిటువంటి దుష్ఫలితాలకన్నింటికి కారణమయినపాకిస్థాన్ నుఒప్పుకునే ఈ భారతకమ్యూనిస్టులు మార్క్సిస్టు వ్యతిరేకులేకందా?

పాకిస్థాన్ కొరకు ప్రత్యేకంగా చెప్పబడుతున్న రాష్ట్రాలు ఒక సమాఖ్య (Federation) గా కలసి వుండేందుకు వీల్లేదు ఆరాష్ట్రాలు భూగోళశాస్త్రరీత్యా ఒకదానితో ఒకటి కలసిలేకుండా అక్కడొకటి ఇక్కడొకటిగా విడివడి వుండటంచేత పరిపాలన సాగించేందుకు ఎక్కువడబ్బు ఖర్చుచేయాలి. ఇది ఆర్థికంగా ప్రజల పురోగమనాభివృద్ధిని ఆటంక పరుస్తుంది. ప్రజల ఆర్థికాభివృద్ధిని ఆటంకపర్చడం మార్క్సిజం ఒప్పుకోదు కందా ?

పోతే 'పాకిస్థాన్'లో యిమడ్చాలని జిన్నా చెబుతున్న రాష్ట్రాలన్నీ తమ కాళ్ళమీద అవి నిలబడలేవు. ఆహార పదార్థలకు హిందూస్థాన్ పైన ఆధారపడాలి. హిందూస్థాన్, పాకిస్థాన్ లకు మధ్య వైరుధ్యం వున్న

ప్పుడు పాకిస్థాన్‌కు హిందూస్థాన్ సాయం చేయకపోవచ్చు. అప్పుడు మళ్ళీ యుద్ధం తప్పదు. యుద్ధం మళ్ళీ బీదలకు నష్టదాయకమే. పైపెచ్చు పాకిస్థాన్‌లో ఖనిజ సంపదలు లేవు. ఖనిజ సంపదలు లేకుండా పరిశ్రమలు అభివృద్ధి కావు. పరిశ్రమలు అభివృద్ధి కాకపోతే కార్మికులు పెరగకపోవడం అటుంచి, ప్రజల జీవిత ప్రమాణం హెచ్చేందుకు వీల్లేదు. కార్మికులు పెరగందే సోషలిస్టు సమాజం స్థాపించబడటం, కనీసం ఆమార్గంలో పయనం చేసినా ఆ మార్గం కూలిపోకుండా నిలవడం కూడా కష్టమే. కనుక ఈ రీత్యా చూచినా పాకిస్థాన్ మార్క్సిజానికి వ్యతిరేకమే.

పైపెచ్చు పాకిస్థాన్ ఒప్పుకున్నా ముస్లిం మైనారిటీల సమస్య తీరేదీకాదు. ఎందువల్లనంటే పాకిస్థాన్ బయట హిందూస్థాన్‌లో కొంతమంది ముస్లిం ప్రజలు ఎలాగో దిగబడిపోతూనే వున్నారు. మరి వాళ్ళకి హిందూస్థాన్‌లో రక్షణవుంటుందనే గ్యారంటీ ఏది? కాకపోతే హిందూస్థాన్‌లోని ముస్లింలకు అన్యాయంజరిగితే పాకిస్థాన్‌లోని హిందువులను చంపుతానని జిన్నా చెప్పొచ్చు. అంటే పాకిస్థాను ఒకరినొకరు చంపుకునేపరిస్థితులు తెచ్చిపెట్టిందన్నమాట. ఒకరినొకరు చంపుకుంటే పాకిస్థాన్ హిందూస్థాన్‌లమధ్య యుద్ధం తప్ప శాంతి వుండటం అసంభవం. ఎక్కడ

శాంతివుండదో అక్కడ ఆర్థిక, రాజకీయ సామాజిక, సాంస్కృతిక, వైజ్ఞానికనాగరికతా పురోభివృద్ధి వుండటం అసంభవం. ఇటువంటి హీనస్థితి ప్రజా సమూహానికి కల్గడం మార్క్సిజం ఒప్పుకుంటుందా? అసలు మార్క్సిజం బయటకువచ్చింది యిటువంటి దీనహీనస్థితిని లేకుండా చేసేందుకే. కనుక ఈరీత్యాచూచినా పాకీస్థాన్ అనర్థదాయకమే. కాబట్టి పాకీస్థాన్‌ను బలపర్చే ఈభారత కమ్యూనిస్టులు మార్క్సిస్టు వ్యతిరేకులే అవుతున్నారు.

అసలు ముస్లింలీగు నాయకత్వానికి దేశస్వాతంత్ర్యం మాటే పట్టదు. ఆనాయకత్వానికి కావలసింది డంబాచారము, అడావిడి, ఏదోఒకసాకుపెట్టి అజ్ఞానాంధకారంలో అటమటిస్తూన్న ప్రజానీకంలో తగాయిదాలుపెట్టి మత తగవుల చాటున వర్గబేధాలను దాచిపెట్టి తమ దోపిడీ విధానాన్ని యధాతధంగా కొనసాగించడంతప్ప మరేం అవుసరంలేదు. జిన్నాతో ఎలాఅయినాసరే సమాధానం కుదుర్చుకోవాలని జవహరిలాల్ నెహ్రూ జిన్నాదగ్గరకు పోయాడు. జిన్నా అనేకమయినగొంతెమ్మకోర్కెలుబయట పెట్టాడు. నెహ్రూ అన్నీ ఒప్పుకొన్నాడు. పాపం పెద్ద పెద్ద కోర్కెలు కోరితే నెహ్రూ వొప్పుకోడని అనుకు న్నాడు జిన్నా. నెహ్రూ ఒప్పుకోకపోతే రాజీ కుదరక పోతే మొదలకుండా కూర్చోవాలనుకున్నాడు. కాని

నెహ్రూ అన్నిటికీ ఒప్పుకునే సరికి జిన్నాకు ఏమీ తోచ లేదు.

"నేను చెప్పిన డిమాండులకు మీరు ఒప్పుకున్నా రనుకోండి. మన ఇద్దరి డిమాండులకు బ్రిటిషు ప్రభుత్వం ఒప్పుకోక పోతే ఏంచెయ్యాలి" అన్నాడు జిన్నా. "మన డిమాండులకు బ్రిటిషు ప్రభుత్వం ఒప్పుకోక పోతే పోరాటం జరగాలి" అన్నాడు నెహ్రూ. ఆ దెబ్బతో జిన్నా బెదరిపోయాడు. "నాకూ నీకూ రాజీ కుదర"దన్నాడు. పోరాటం అంటే జిన్నాకు అంతభయం. పోరాటం అంటేనే భయపడే జిన్నా ఇంకా స్వాతంత్ర్యాన్నెలా సాధించగల్గుతాడు. నిజానికి జిన్నా ముస్లింలీగూ రెండూ కూడా బ్రిటిషు ప్రభుత్వపు దయాదాక్షిణ్యాలతో బ్రతుకు తున్నారు. కనుక అట్టి త్యాగధనులతో కూడిన ముస్లిం లీగు దేశభక్త సంస్థకాక మరేమవుతుంది? అంతేగాక కాంగ్రెసువలె సత్యాగ్రహ పోరాటాలను నడుపనంత మాత్రాన ఒక సంస్థ దేశభక్తసంస్థకాకుండాపోదు" అనే కమ్యూనిస్టుల మాటల్లో అర్థంలేదన్నమాట. పోరాటం కావాలన్నప్పుడు అవసరం లేదని, అవసరం లేదన్నప్పుడు కావాలని అనే కమ్యూనిస్టులు ముస్లింలీగువంటి అభివృద్ధి నిరోధకుల మాటలకు తాళంవేయడం మినహా మరేమీచేయలేరు. ఆగస్టుపోరాటంలో పాల్గొనకుండా

పిరికి వాళ్లలాగా ప్రవర్తించిన కమ్యూనిస్టులు యింత కన్నా ఎక్కువ చెప్పలేరు. జోగీ జోగీ రాసుకుంటే బూడిద రాలిందన్నట్టు ముస్లింలీగు కమ్యూనిస్టులు ఏకమై రాసుకుంటే మధ్యన బానిసత్వంమాత్రం రాలుతోంది.

అసలు ముస్లింలీగుకు ఈ దేశంలో ఏమాత్రం బలంవుంది ? ముస్లింలీగు ముస్లిం లందరకూ ప్రాధాన్యత వహించే సంస్థకాదు. ముస్లింలీగు ముస్లిం లందరకూ ప్రాతినిధ్యం వహించే సంస్థేగనుకఅయితే రాష్ట్ర ఎసెంబ్లీ ఎన్నికలలో అన్నిస్థానాలు ముస్లింలీగే గెలిచి వుండవలసింది. కాని చాలా స్థానాలను కాంగ్రెసు ముస్లింలే గెలిచారు. ముస్లింలీగు ఒక్క రాష్ట్రంలో కూడా మంత్రివర్గం స్థాపించలేకపోయింది. సింధులో మాత్రం యూరోపియను సభ్యులతో అంటే ప్రభుత్వంతో చేతులు కలిపి 'యివ్వాళా రేపా' అన్నట్టు వూగులాడుతున్న ఒక కీలుబొమ్మ మంత్రివర్గాన్ని స్థాపించింది. కాబట్టి ముస్లింలీగుకు ముస్లిం ప్రజలలో బలంలేదనీ, ముస్లిం ధనాఢ్యులకు జమీందారులకు మాత్రమే అది ప్రాతినిధ్యం వహించు తుందనీ స్పష్టమవుతోంది. అందువల్లనే ఆ జమీందారీ ధనాఢ్యుల బాధ పడలేక ముస్లింలీగునుండి బయటపడ్డానని సయ్యద్ (సింధురాష్ట్ర) అసెంబ్లీ కొయిలిషన్ నాయ

కుడు) ఎలుగెత్తి చాటాడు. కనుక ఇటువంటి అభివృద్ధి నిరోధకమైన జమీందారీ ముస్లింలీగుకు సాయం చేయడ మంటే, వారిపాకీస్థాన్ ఒప్పుకోవడమంటే ప్రజసామాన్యా నికి ప్రజస్వామ్యానికి వ్యతిరిక్తమే అవుతుంది. గనుక మార్క్సిజానికి వ్యతిరేకమే అవుతుంది.

పాకీస్థాను ఒప్పుకోవడంలో ఈభారత కమ్యూ నిస్టుల నిగూఢమయిన ఆకాంక్ష వేరేవుంది. ఫిన్లాండుపైనా పోలాండుపైనా దురాక్రమణచేసి, నేడు పర్షియాపైన కూడా పడేందుకు సిద్ధగావున్న 'రెడ్ యింపీరియలిస్టు' రష్యాను అనుసరిస్తున్న ఈకమూనిస్టులు ప్రజల సమ్మతి లేకుండా ముస్లింలీగుకు పాకీస్థాన్ కట్టబెడతారనడంలో సందేహం లేదు. అంతేకాకుండా దేశాన్ని చిన్న చిన్న ముక్కలుగా విభజించితే వాళ్ళు కొన్నిభాగాల్లోనయినా తమ ప్రాతినిధ్యాన్ని చైనాలోలాగా సంపాదించు కోవచ్చునని వాళ్ళ వూహ. అలాచేసి దేశంలో అంతర్యుద్ధాన్ని, అశాంతిని హింసాకాండను ద్రోహపు దుర్మార్గాలను రెచ్చగొట్టడం ఫాసిజానికన్నా మరేం మంచి కానేరదు. ఇదివరకే ఋజువుచేసినట్లు ఫాసిస్టు పంథాల నవలంబిస్తున్న యీకమ్యూనిస్టులు కొన్నిచోట్ల పైన చెప్పిన కృత్రిమమైన ప్రజాస్వామిక వ్యతిరేక

విధానాలవల్ల అధికారంలోకి వచ్చినప్పటికీ ఈ రైతు - కూలీలకు ఏం లాభం జరుగుతుంది? ఏమీ లాభం జరగదు!

పోతే ప్రపంచమంతా ఒకే ప్రజాస్వామిక సమాఖ్యగా వుండాలని చూస్తూంటే పాకీస్థాన్ వంటి చిన్న చిన్న మిత్రరాజ్యాల నేర్పరచుకోవడం అర్థంలేనిపని. సామ్రాజ్యకాంక్ష లేకపోయినట్లయితే యిలా ప్రత్యేకరాజ్యాల కోరనవసరం లేదు. పాకీస్థాన్ వంటి ప్రత్యేక మతరాజ్యాన్ని ముస్లింలీగు కోరుతూందంటే విశ్వమానవ సౌభ్రాతృత్వానికి త్రోవతీసే ప్రపంచసమాఖ్యను ఆవలకు త్రోసివేస్తూందంటే తనప్రత్యేక పాకీస్థాన్ రాజ్యంద్వారా ముస్లిం సామ్రాజ్య స్థాపనకు పూనుకుంటోందని అర్థం. సామ్రాజ్య స్థాపనా, అందునా మతసిద్ధాంతంతో కూడిన పాకీస్థాన్ సామ్రాజ్య స్థాపన రైతు- కూలీలకు తీరని అపకారి అవుతుంది. కాబట్టి పాకీస్థాన్, రైతు - కూలీల క్షేమం కోరే మార్క్సిజానికి వ్యతిరేకం అన్నమాట అందువల్లనే నెహ్రూ "పాకిస్థాన్ వాదం" మోడరనిజానికి, మెడీవియలిజానికి మధ్య తగాయిదా అని అన్నాడు.

పాకీస్థాన్ హిందూస్థాన్‌లు ఏర్పడినాయే అనుకోండి. ఐక్యభారత దేశం వున్నంత బలవత్తరంగా అవి వుండలేవు. పై పెచ్చు ఎప్పటికప్పుడు అంతర్యుద్ధ భయం

ఈ రెంటికిమధ్య వుండనే వుంది గనుక, పాకీస్థాన్‌వంటి చిన్నరాజ్యం మళ్ళీ ఏ బ్రిటిషు సామ్రాజ్యంపైనో లేక మరే యితర పరాయి ప్రభుత్వంపైనో ఆధారపడి వుండవలసిందే. అలా ఇతర ప్రభుత్వంపైన ఆధారపడి వున్నప్పుడు ఆ పరప్రభుత్వం పాకీస్థాన్‌పై తన పెత్తనాన్ని సాగించక మానదు, పైపెచ్చు తన ప్రాతినిధ్య ప్రాబల్యం కోసం అంతర్యుద్ధం తెచ్చిపెట్టి, అరాజకాన్ని కూడా లేవదీయవచ్చు. అంటే చిన్న చిన్న భాగాలుగా ఇండియా విడిపోయి వుండటమంటే పరాయి ప్రభుత్వాల పైన ఆధారపడి పరోక్షంగా బానిసత్వాన్ని మరో మార్గంలో మన నెత్తిపైన రుద్దుకోవడన్నమాట. బానిసత్వాన్ని మన నెత్తిపైన రుద్దుకోవడమంటే సోషలిజానికి రెండుమెట్లు వెనుకబడివుండడమన్నమాట. కాబట్టి ఈ రీత్యాకూడా పాకీస్థాన్ ఒప్పుకొని దేశాన్ని రెండుగా చీల్చడం మార్క్సిజానికి అపకారం చేయడమే అవుతుంది.

ఇలా దేశం భాగాలు భాగాలుగా చీలడంలో మరొక ప్రమాదంకూడా వుంది. హిందూస్థాను, పాకీస్థాన్ సమస్యే గాకుండా సిక్కులు సిక్కుస్థానును, స్వదేశ సంస్థానాలు తమ శాశ్వతమైన వునికిని, యూరోపియన్లు తమ యూరోపియన్ స్థాన్‌నుకూడా కోరవచ్చు. అప్పుడు

దేశానికి సంభవించే పరిమాదము, ముప్పు యింతింత అని చెప్పడానికి వీల్లేదు. దేశం చిన్నాభిన్నం, ద్రవ్యాలు వరియ్యాలై పోతూంది. ఐక్యత నశిస్తుంది. అరాజకం ప్రబలుతుంది. అల్లర్లు మితిమీరతాయి. శాంతి నశిస్తుంది. అంతా అల్లకల్లోలం, అంకభండాలం తప్ప మరి మిగిలేదేమీ వుండదు. ఇటువంటి సందర్భంలో, దేశం అరాజక స్థితిలో వున్న సందర్భంలో మరో దేశం భారత దేశం పైన బడి దండయాత్రచేసి అనైక్యతను ఆసరాగా జేసుకొని దేశాన్ని జయించి మన రాజకీయ స్వాతంత్ర్యాన్ని అపహరించి తీరుతుంది. అంటే మనం మన స్వాతంత్ర్యాన్ని కోల్పోతామన్నమాట. రాజకీయ స్వాతంత్ర్యాన్ని కోల్పోయిన మనం, సోషలిజానికి రెండు మెట్లు వెనుకబడుతున్నామన్న మాట. కాబట్టి ఈరీత్యాకూడా పాకీస్థాన్ మార్క్సిజానికి వ్యతిరేకమే.

అసలు పాకీస్థాన్ అవుసరం ఏమి వుందా అనే విషయాన్ని ఆలోచించాలి. ముస్లింలు అణగద్రొక్కబడతారనే "భయమేకందా పాకీస్థాన్ డిమాండుకు కారణం! అయినప్పుడు అసలు హిందువులు ముస్లింలనుఎక్కడ అణగద్రొక్కారోకూడా చూపించాలి కదా! కాంగ్రెసు మంత్రివర్గాలు ముస్లింలఎడ ఛాలాబాగా ప్రవర్తించినా

యని గవర్నర్లే అన్నారు కందా! అయినప్పుడు మరి ఇంకా ఈ పాకీస్తానుగోల దేనికి? అసలు ముస్లింలు హిందువులు కలసి ఒకే రాజ్యాంగయంత్రంలో ఎప్పుడు పనిజేశారు? ముస్లింలకు అన్యాయం ఎప్పుడు జరిగింది? అటువంటిదేమీ లేదు. అయినప్పుడు కలిసి పనిజేసి అన్యాయం జరిగితే విడిపోవాలిగాని, ఏమీ లేకుండా ఈ ఒట్టిఆర్భాటం దేనికి? అందుకనే డాక్టర్ రాధా కుముద్ ముఖర్జీ అన్నాడు. "పాకీస్తాన్ విషయం పెళ్ళి కాకముందు విడాకులిచ్చుకునే పద్ధతిగావుంది" అని అన్నాడు.

కాంగ్రెసు ఎప్పుడూ చెపుతూనేవుంది, ఇష్టం కాకపోయిన ఏ యూనిటీఅయినా ఫెడరేషనులోనుండి విడిపోవచ్చునని. పైపెచ్చు ఆగష్టు తీర్మానంలో, అంతర్యుద్ధం వస్తుందనే భయం వున్నట్లయితే, అధికారాన్ని ముస్లింలీగుకే అప్పచెప్పవచ్చునని కూడా తీర్మానించింది. ఇంతకంటె సుహృద్భావ పూర్వకమైన హామీని మరేమివ్వ గలుగుతుంది కాంగ్రెస్? అయినాగాని ఆగష్టు పోరాటంలో స్వాతంత్ర్యాన్ని సాధించేందుకు కాంగ్రెసు పూనుకోలేదు. అంటే ముస్లింలీగుకు స్వాతంత్ర్యం అవసరం కాదని తేలింది. స్వాతంత్ర్యం అవసరంలేని ముస్లింలీగును బలపర్చడం మార్క్సిజాన్ని అనుసరించడం ఎలా అవు

తుంది ? ముస్లింలీగుకు పోరాటంద్వారా స్వాతంత్ర్యాన్ని సాధించడం కాదు కావలసింది. ముస్లిం జమీందారులకు, నవాబులకు, ముస్లిం కాపిటలిస్టులకు పాకిస్థాను చేతులారా తెచ్చి అప్పజెప్పి ముస్లిం,రైతు-కూలీ బీదలను ఆ దోపిడి దారులచేత నిలువు దోపిళ్ళు చేయించడం కావాలని తేల్తోంది. ఇలాంటి పాకిస్థాను వాదాన్ని బలపర్చే ఈ భారత కమ్యూనిస్టులు మార్క్సిస్టులేనా ?

పోనీ పాకిస్థాన్ ఇచ్చేందుకు ఒప్పుకుందామన్నా పాకిస్థాన్ యివ్వడమనేది జరుగడం స్వతంత్ర భారతదేశలో నేకందా? బ్రిటిషు సామ్రాజ్యవాదం మనకు స్వాతంత్ర్యాన్ని కట్టి పెట్టదు కందా? స్వాతంత్ర్యం ఒకరిచ్చేది కాదుకందా? లేనప్పుడు, అధికారాన్నంతా ముస్లింలీగుకే అప్పగించేందుకు ఆగస్టు తీర్మానంలో కాంగ్రెసు ఒప్పుకున్నా ముస్లింలీగు పోరాటానికి కలిసి రావడం లేదంటే ముస్లింలీగు అభివృద్ధి నిరోధకసంస్థ అని తేలడం లేదా? ఇటువంటి విప్లవ వ్యతిరేక, విప్లవ ప్రతిఘాతుక ముస్లింలీగును బలపర్చడం మార్క్సిస్టుల లక్షణమేనా?

మాట్లాడితే భారత కమ్యూనిస్టులకు ప్రతిదానికీ రష్యావంక చూపడం పరిపాటయి పోయింది. రష్యాలో సోవియట్ యూనియన్ నుండి యూనిట్లకు విడిపోయే

హక్కుందని కూడా యీ భారత కమ్యూనిస్టులంటున్నారు. కాని "సోవియట్ రష్యా కానిస్టిట్యూషన్‌లో విడిపోయే హక్కుందిగాని విడిపోవడానికి వీలులేదు" అని వ్రాసి వుందని రాధా కుముద్ ముఖర్జీ ఏ న్యూ అప్రోచ్ టు ది కమ్యూనల్ ప్రోబ్లమ్ అనే పుస్తకంలో వ్రాశాడు. కాబట్టి కమ్యూనిస్టుల ఈ వాదంకూడా తప్పనని తేలింది.

పాకిస్థాన్‌ను ముస్లింలీగు కోరడం ముస్లిం సామ్రాజ్యస్థాపనకన్నాం. అదెలాగంటె, ముస్లింలీగు తనకు ఏ మాత్రంకూడా ప్రాతినిధ్యం లేని అస్సాము రాష్ట్రాన్ని పాకిస్థాన్‌లో కలపమని కోరడంలో విశదమవుతుంది. అస్సాంను తన ఆధిపత్యం క్రిందకు రావాలని కోరిన ముస్లింలీగు ఇండియా అంతటిని, దాంతోపాటు ప్రపంచాన్నంతటినీ మాత్రం కోరదని అనుకోవడానికి అవకాశ మెక్కడుంది? కాబట్టి ముస్లింలీగుయొక్క పాకిస్థాన్ వాంఛ ముస్లిం సామ్రాజ్యానికి త్రోవతీసి రైతు - కూలీల యోగక్షేమాలకు ముప్పుదెచ్చి రైతు కూలీల యోగక్షేమాన్ని కోరే మార్క్సిజానికి వ్యతిరేకమే అవుతుంది.

ఇంతవరకూ పాకిస్థాన్ ఎలా అభివృద్ధి నిరోధకమో చూపించుతూ వచ్చాను. మార్క్సిజానికి పాకిస్థాన్ వ్యతిరేకమని చెప్పాను. ఇప్పుడు ఆమార్క్సిజం

యొక్క వుద్దేశ్యం ఏమిటో టూకీగా చెబుతాను. మార్క్సిజం యొక్క వుద్దేశ్యమేమంటే వుత్పత్తిని, పంపిణీని సమాజపరం చేసి వర్గరాహిత్య సమాజాన్ని ర్పరచి ముఖ్యంగా రైతు - కూలీలకు, ప్రజానీకమంతటికి కూడా. అన్నివిధాలైన స్వాతంత్ర్యాన్ని, శాంతిని, అభ్యుదయాన్ని చేకూర్చడమే. ఈవిధంగా మార్క్సిజం ప్రజలకు క్షేమం కూర్చ చూస్తుంది. పాకిస్థా౯ ఏవిధంగా సామ్రాజ్యవాద నియంతృత్వ విధానాలకు త్రోవతీసి ఫాసిజాన్ని స్థాపించి ప్రజల క్షేమానికంతటికీ అభివృద్ధి నిరోధకంగా పరిణమిస్తుందో పైనే ఋజువు చేశాను. మత తత్వం ధనికులకు బీదల్ని దోపిడి చేసేందుకు ఒక దొంగ ముసుగు. కాని నేడు శ్రామికోద్యమము, సోషలిస్టు వుద్యమము, బలవత్తరమవ్వడంచేత యీ మత ముసుగు క్రిందవుండే ధనిక తత్వానికి ముప్పు, చావురోజులు ఆసన్నమయినాయి. అందువలన మతతత్వం క్రింద దాగుకున్న ధనికవాదంతో తన్ను తాను రక్షించుకోవాలంటే శ్రామిక సోషలిస్టు వుద్యమాలను అణచి పారవేసేందుకు ఫాసిస్టు నియంతృత్వాన్ని స్థాపించి తీరాలి. ఈ ఫాసిస్టు నియంతృత్వం రైతు - కూలీల క్షేమ లాభాలకు వ్యతిరేకమే. కాబట్టి మార్క్సిజానికి వ్యతిరేకము. అందువలన

పాఠకులు యిప్పుడు పాకీస్థాన్ మార్క్సిజానికి ఎలా వ్యతి రిక్తమో తెలుసుకోగల్గుతారు. మార్క్సిజం వ్యక్తిగత ఆస్తులులేని వర్గరాహిత్య సమాజంకు కావాలంటే పాకీస్థాన్ తన మతతత్వంతో వ్యక్తిగతఆస్తులు వుండాలని చెబుతూ ధనికులక్రింద సామరస్యంగా బీదలు అణగి వుండాలని చెబుతుంది. కనుక పాకీస్థాన్ మార్క్సిజానికి వ్యతిరేకమని తేలింది. పాకీస్థానుకు మార్క్సిజం వ్యతి రేక మయినప్పుడు పాకీస్థాన్‌ను బలపర్చే కమ్యూనిస్టులు కూడా మార్క్సిజానికి వ్యతిరేకులే నన్నమాట. అంటే యీ భారత కమ్యూనిస్టులు మార్క్సిజానికి వ్యతిరేకంగా పోవడంతో ఫాసిస్టులయ్యారని తేలింది.

అయితే మార్క్సిస్టు అయినవాడు ఈ పాకీస్థాన్ సమస్యను ఎలా తీర్చుతారు? ఈ విషయాన్నే శాస్త్రీ యంగా ఆలోచించి సరయిన సమాధానాన్ని మనం మన సమస్యా పరిష్కారానికి తెచ్చుకోవాలి. ఈ పాకీస్థాన్ సమస్యాపరిష్కారానికి సరియైన మార్గం పండిట్ జవా హారిలాల్ నెహ్రూ చూపించుతున్న ప్రజాసంబంధోద్యమమే (Mas Contact movement) సరియైన బాట. అదె లాగో చూద్దాం.

పండిట్ నెహ్రూ "పాకిస్థాను వాదం జమీందారీ వాదానికి (Medivialism) కు నవీనవాదానికి (Mod_eranism or Democratic Socialism) కు మధ్య జరిగే పోరాటం" అని చెప్పాడు. అంటే పండిట్ నెహ్రూ ముస్లింలీగ్ జమీందారులయొక్క ధనాఢ్యులయొక్క నాయకత్వం క్రింద నడుస్తుందని చెప్పాడన్నమాట. ఈ విషయాన్ని పైనే ఋజువుచేశాము. కనుక ధనికులు తమ స్వార్థాన్ని అన్యాయంగా, ఆర్జించిన ధనాన్ని, కాపాడు కునేందుకు పాకిస్థానం అనే మతతత్వపు ముసుగు క్రింద ఆటలాడు తున్నారన్నమాట. పాకిస్థాన్ ధనికుల మాయ కాబట్టి దీని విచ్ఛేదం చేయాలంటే ధనికులకు బీదలకు గల సంబంధాన్ని బట్టబయలు చేయాలి. అంటే ధనికులు మతతత్వంక్రింద దాక్కుని పాకిస్థాను అనే పిచ్చిమత నినాదం బీదల్ని మోసం చేస్తున్నారని తెలియజెయ్యాలి, అంటే ముస్లింబీదల్లో ముస్లింలీగు ఏవిధంగా ధనాఢ్యుల సంస్థో తెలియజేస్తూ, ధనికులయొక్క ఆశయాలకు బీదల యొక్క ఆశయాలకు వారివారి స్వార్థహక్కుల రక్షణలో తేడా, వైరుధ్యం వుందని. నిజాయితీని తెలియజెయ్యాలి. అప్పుడే ముస్లిం సామాన్య ప్రజానీకం, రైతు, కూలీలు, ముస్లింలీగుయొక్క అభివృద్ధి నిరోధకమయిన విప్లవ

వ్యతిరేకమయిన, విప్లవ ప్రతిఘాతుక మయిన నాయకత్వంనుండి బయిటపడి జాతీయ స్వాతంత్ర్యోద్యమంలో కలసి దేశరాజకీయ ఆర్థిక స్వాతంత్ర్యాలను సాధించగలుగుతారు. ఆనాడే పాకీస్థాన్ పగటికల పటాపంచలు చేయబడుతుంది.

"మతము ప్రజలపాలిటి మత్తుమందు" మార్క్సు.

"మతము గమ్యస్థానం జేరే స్వాతంత్ర్య పథంలో ముళ్ళకంప వంటిది"— లెనిన్.

"యదార్థమయిన మతతత్వం భయంకరం. కృత్రిమ మతతత్వం రాజకీయ ప్రతీఘాతం"— నెహ్రూ.

# తత్వాలలో తారతమ్యం

అది ఏ యిజమయినా, ప్రతియిజానికి ఒక తత్వంవుండి తీరాలి. తత్వం (Philosophy) లేకుండా (ism) యిజం వుండటంవల్ల తత్వమంటే ఏమిటి? "Philosophy is the history of human life expressed in tangible quantities" M. N. Roy. "Philosophy is the history of human life" expressed in real terms"—Lenin. Both mean the same thing. లెనిన్, రాయ్‌లు యిద్దరు చెప్పిందీ

ఒకటే, "మానవజీవిత చరిత్రను యదార్థరూపులయందు (భౌతిక 'నాణములల్లో') తెలియజెప్పునది తత్వం." అంతే గాని మనకు కన్పించకుండా వుండే మానవాతీతమయినవి ఏవో వున్నయ్యని వర్ణించే పదజాలం కూర్పుమాత్రం, తత్వం కానేరదు.

ఇప్పుడు పాకీస్థాన్, మార్క్సిజం అనే విషయం విశదీకరించబడుతోంది. పాకీస్థాన్ తత్వం మతతత్వం: మార్క్సిజం తత్వం భౌతిక తత్వం. మొదటిది వూహా మాత్రం, రెండవది యథార్థవాదం. మతం ఋజువు లేకుండా మానవాతీతమయిన దైవశక్తి వుందని చెబుతూ ఆ భావ దాస్యంలో శ్రామికవర్గాన్ని, ధనికవర్గానికి, భౌతిక దాస్యం చేసేలా చేస్తోంది. మార్క్సిస్టు తత్వం ప్రపంచంలో మానవులంతా ఒకే అనే సిద్ధాంతంతో అసలు దాస్యమనేదాన్నే నాశనం చేస్తూ, సర్వమానవాళికి శాంతి సుభిక్షులను చేకూరుస్తోంది. అందువలన మార్క్సిస్టు భౌతిక తత్వానికీ, పాకీస్థాన్ మతతత్వానికి నాగలోకానికి నక్కకు గల తారతమ్యం వుంది.

మతం వర్గసామరస్యాన్ని వర్గతారతమ్యతను కోరుతుంది. మార్క్సిజం వర్గకలహాన్ని, వర్గరాహిత్యతను కోరుతుంది. ఎలా ? మతం కర్మ సిద్ధాంతాన్ని ఒప్పుకుం

టుంది. కర్మ సిద్ధాంతం మానవులు పూర్వ జన్మలో చేసుకున్న పుణ్యంవల్ల ధనికులుగాను పాపంవల్ల బీదలుగాను జన్మించుతారని చెబుతుంది. అందువల్ల ధనికులకు బీదలు లోబడి వుండాలని, సమాజశాంతి కొరకు యిద్దరూకలసి వుండాలని చెబుతుంది. కాని ధనికులు బీదల్ని అనేక విధాల తమ ధనప్రాబల్యాన్ని వుపయోగించి పీడించుకు తింటున్నారనే విషయాన్ని మాత్రం పైకి రానివ్వదు. ఇది మతం చెప్పే మహా పెద్ద న్యాయం! అసలు మానవునకు పునర్జన్మ వున్నదనే విషయం తప్పని సైన్సు చెపుతోంది. కాబట్టి మతం వర్గ సామరస్యాన్ని కోరడము, వర్గ తారతమ్యాన్ని ఒప్పుకోవడమూ కూడా తప్పే. అందువలన మతతత్వంపైన ఆధారపడిన పాకిస్థాన్ వాదంకూడా శుద్ధతప్పే వర్గసామరస్యం ఫాసిజంగానే పరిణమిస్తుంది. బీదలు ధనికులకు లోబడి పనిచేసి జీవించాలని చెప్పడం, ధనికులు ఎంతపీడించినా, దోచినా వూరుకోవాలనడమే. ధనికుల నియంతృత్వానికి లోబడటమే. బీదలు ఎదురు తిరిగినా ధనికతత్వం అధికారంలో వున్నందువల్ల నియంతృత్వం వహించుతుంది. "ధనిక నియంతృత్వం ఫాసిజం" అన్నసంగతి మనకు తెలిసినదే.

మార్క్సిజం వర్గ కలహాన్ని, వర్గ రాహిత్యతను కోరుతూందన్నాం. ప్రపంచంలో మానవుడెవ్వడూ పుట్టుతూనే సిరిసంపదలతో రాలేదు. అందరూ మానవులుగానే పుట్టారు. అందరికి శక్తి యుక్తులు, సామర్థ్యాలు వుంటాయి. వారివారి శక్తులనుపట్టి ప్రతివారు పనిచేయగలరు. ప్రకృతిలో జన్మించిన ప్రతివాడుకూడా ప్రకృతిలోని సహజసంపదలోని వివిధ వస్తువుల్తో పనిచేసి వాటి ద్వారా తన యిచ్ఛవచ్చినరీతిని, తనకు కావలసినంతవరకు తన జీవితావుసరాల్ని గడుపుకోవచ్చు. ఇలా ప్రతిమానవునికి హక్కువ్పుంది. మానవులందరు సమానులే.

కాని ధనికులు తాము అక్రమంగా దోపిడీచేసి సంపాదించిన అన్యాయార్జిత ధనాన్ని చేతులారా సమాజానికి అప్పగించేందుకు ఒప్పుకోరు. కారణమేమంటే మానవుడు స్వార్థుడు. మానవుడు స్వార్థుడుగనుకనే బీదవాడు తన జీవితాన్ని నడుపుకునేందుకు ధనికులపై తిరుగుబాటుచేసి రాజ్యాంగయంత్రాన్ని స్వాధీనపర్చుకుని సమాజంలోని వుత్పత్తి, పంపిణీశక్తులను ప్రజలపరం చేస్తాడు. అప్పుడు సమత్వం ఏర్పడుతుంది. ఇదంతా మార్క్సిజం కోరే వర్గ కలహం. తద్వారా సంభవించే వర్గరాహిత్య సమాజం సమానత్వం.

కనుక పాకిస్థాన్ యొక్క మూలసిద్ధాంతము ఫాసిజానికి, మార్క్సిజము న్యాయబద్ధము, ధర్మబద్ధము అయిన సమానంగల వర్గరాహిత్య సమాజానికి త్రోవ తీస్తాయి గనుక, ఒకదానికొకటి పరస్పర విరుద్ధం. కనుక మార్క్సిస్టులు పాకిస్తాన్ వాదాన్ని చంపుకోరాదు.

## అంతర్యుద్ధం అసంభవం

పాకిస్థాన్ యివ్వకపోతే భారతదేశస్వాతంత్ర్యసము పార్జన దుర్భరమనీ, అంతర్యుద్ధం లేకుండా స్వాతంస్థాపన కష్టమనీ కొంతమంది అంటున్నారు. ఇంతకన్నా తెలివితక్కువ మరొకటి వుండదు. ఎందువల్లనంటే జిన్నాకుగాని, ముస్లింలీగుకుగాని యీనాడు అంతర్యుద్ధం తెచ్చే బలంలేదు. జిన్నా ఆటలు ఇండియాలో కేవలం బ్రిటిషువాళ్ల ఆసరావల్ల సాగుతున్నయ్యి. దానికి నిదర్శన మేమంటే, పాకిస్థాన్ యిచ్చిన తర్వాత కూడా బ్రిటిషువాళ్ళని యిండియాలోనే వుండాలని కోరడమే.

ముస్లింలీగుకు ముస్లింలలో అంతర్యుద్ధం తెచ్చే బలం లేదన్న సంగతి రాష్ట్రీయ ఎన్నికలలో అనేక చోట్ల

జాతీయముస్లింలు గెలవడంతో తేలిపోయింది. పైపెచ్చు అనేకమంది సయ్యద్ ఫజుల్‌హక్కు-వంటి ముస్లింలీగు నాయకులు బయటకు రావడంతోను, లీగు స్వతంత్రంగా మంత్రివర్గాలను ఏర్పరచ లేకపోవడంతోను, యూరోపియను సభ్యులమీద ఆధారపడి వుండడంతోను తేటతెల్లమయింది. జిన్నా తనపాకీస్థాన్ ఒప్పుకోకపోతే అంతర్యుద్ధం తెచ్చి రక్తపాతం చేస్తానని చెపుతున్నాడంటె ఏదో తన పట్టుదలను చెల్లించుకుని ప్రాబల్యం సంపాదించుకోవాలనే ప్రతి బలహీనుడుచేసే డంబాచారమేనని మనకు తెలుసుకాబట్టి, ముస్లింలీగు ఈదేశంలో అంతర్యుద్ధం తెస్తుందనే భయం అవ్వసరమే లేదు.

పోతే దక్షిణహిందూస్థానంలో మహమ్మదీయులు అసలు హిందువులపైకి తిరగబడ్డమనేది జరుగనేజరుగదు. ఉత్తరహిందూస్థానంలో గట్టిగా ఆర్గనైజ్ అయివున్న హిందువుల్ని, సిక్కుల్ని, జాతీయ ముస్లింలను ఎదుర్కోవడం అంతకంటె దుర్భరం. కనుక అంతర్యుద్ధ భయం లేనేలేదు! లేనేలేదు!! లేనేలేదు!!!

పోతే భారత కమ్యూనిస్టుపార్టీ వారికి ముస్లింలీగుతో కలసి కాంగ్రెసును నాశనం చేసేందుకు అంతర్యుద్ధం తేవాలని వుందిగాని, మహాసముద్రంలో కొంగ

రెట్టన్నట్లు కాంగ్రెసు బలాన్ని ఎదుర్కొంటూ ఈచిన్న కమ్యూనిష్టుపార్టీ ముస్లింలీగుతో కల్సినా "జోగీ జోగీ రాసుకుంటే బూడిదరాలుతుంది" అనేసామెతకన్నా ఎక్కువ జరిగేదేమీలేదు.

కాంగ్రెసును నాశనం చేయడం స్వాతంత్ర్యాన్ని నాశనం చేయడం. సోషలిజాన్ని వెనక్కు నెట్టడమే. అంటే మార్క్సిజానికి వ్యతిరేకం. కాబట్టి అంతర్యుద్ధం తేవడం మార్క్సిజానికి వ్యతిరేకమే. కాబట్టి అంతర్యుద్ధం తేవాలనుకునే కమ్యూనిష్టులు మార్క్సిష్టు వ్యతిరేకులే.

ఇప్పుడు ఆ ప్రధాని అట్లీ బ్రిటిషుమంత్రివర్గ రాయబారంకూడా మైనారిటీలు మెజారిటీల స్వాతంత్ర్యానికి అడ్డువస్తే ఒప్పుకోమని స్పష్టంగా ప్రకటించారు. కాబట్టి బ్రిటిషుమంత్రుల రాయబారవర్గం జిన్నా బెదరింపులకు జడవకుండా అధికారాన్ని భారతప్రజల హస్తగతం (కాంగ్రెసుద్వారా) చేసి తీరాలి. లేకపోతే బ్రిటిషు మంత్రుల రాయబారవర్గపు రాక ఒక తంతేనని విషయం యిదివరలోలాగానే స్పష్టమవుతుంది. పాకిస్థాన్ మార్క్సిజానికి వ్యతిరేకం.

# మోడరన్ రైటర్స్ కాంగ్రెస్ పుస్తకాలు

వచ్చినవి :

1 విప్లవగేయాలు (1 భాగం)
2 పాకిస్తాన్ - మార్క్సిజం
రామక్రిష్ణరావు బలుసు, బి ఏ.,
3 అగష్టు గేయాలు (కాశీవిశ్వనాధం)
"నెత్తురు కలం"

ప్రెస్సులో వున్నవి:

4 కమ్యూనిస్టులకు ఛాలెంజి (రామక్రిష్ణరావు బలుసు బి ఏ.,)
5 కాంగ్రెసు సోషలిష్టు నాయకులు
రామక్రిష్ణరావు బలుసు, బి.ఏ.,
నాగభూషణం రామిశెట్టి

రానున్నవి :

6 రాజకీయ వ్యాసాలు
7 యువజన కాంగ్రెసోద్యమం
8 ఇండియాలోని వివిధ రాజకీయ పార్టీల నిజస్వరూపం
9 సోషలిజం ఏమిటి? ఎందుకు?
10 గాంధిస్టు విద్యార్థి
11 సంస్థ నిర్మాణం
12 విప్లవగేయాలు (2 భాగం) రామక్రిష్ణరావు బలుసు బి.ఏ.,
13 జయప్రకాశ్ నారాయణ్
రామక్రిష్ణరావు బలుసు, బి.ఏ.,
నాగభూషణం రామిశెట్టి
14 సంస్కారి
15 ప్రమదావనం - కాశీవిశ్వనాధం వల్లభనేని
16 దేశద్రోహులు